# బడికి వెళ్లిన సింహం

ఫిలిప్



ఒకప్పుడు ఒక అమ్మాయి ఉండేది. ఆ అమ్మాయికి బడికి వెళ్లటం ఏమాత్రం ఇష్టం లేదు. ఆమె ఎప్పుడూ బడికి ఆలస్యంగా బయలుదేరేది. దాంతో ఆమె వేగంగా వెళ్లాల్సి వచ్చేది. అయినా అంత వేగంగా వెళ్లేది కాదు.

ఒక రోజు ఎప్పటిలాగా ఆమె హడావిడిగా బడికి వెళుతోంది. ఒక మలుపు తిరిగే సరికి దారికి అడ్డంగా ఆమెకు ఒక సింహం కనపడింది. అది ఆమె కోసమే కాచుకుని ఉంది. తన పసుపు పచ్చని కళ్లతో అది ఆ అమ్మాయిని చూసింది. అది గర్జించటంతో కోరల్లాంటి దాని పళ్లను ఆ అమ్మాయి చూసింది.

“నిన్ను తినేస్తాను,” అంటూ సింహం గర్జించింది.

“అయ్యో!” అంటూ ఆ అమ్మాయి ఏడవసాగింది.

“ఆగు!” అంది సింహం. “నా మాట ఇంకా పూర్తి చెయ్యలేదు. నీతోపాటు నన్ను బడికి తీసుకుని వెళ్లకపోతే నిన్ను తినేస్తాను.”

“అయ్యో!” అంది ఆ అమ్మాయి. “పెంపుడు జంతువులను బడికి తీసుకుని రాకూడదని మా టీచరు చెప్పారు. అందుకే నిన్ను బడికి తీసుకుని వెళ్లలేను.”

“నేను పెంపుడు జంతువుని కాదు,” అంటూ సింహం మళ్లీ గర్జించింది. కోపంతో దాని తోక అటూ, ఇటూ ఊగటం ఆ అమ్మాయి చూసింది.

“నీ స్నేహితుడిని నీతోపాటు బడికి తీసుకువచ్చావని మీ టీచరుకి చెప్పవచ్చు," అంది సింహం, “ఇక వెళదామా?”

చిన్న అమ్మాయి ఏడుపు ఆపేసింది. “సరే, నిన్ను బడికి తీసుకుని వెళతాను. కానీ రెండు షరతులు. మొదటిది, బడిలో నువ్వు ఎవ్వరినీ తినకూడదు. దానిని ఎంతమాత్రం అనుమతించరు,” అని చెప్పింది.

“నేను గుర్రు పెట్టవచ్చా?” సింహం అడిగింది.

“గుర్రు పెట్టవచ్చు," అంది చిన్న అమ్మాయి.

“నేను గర్జించవచ్చా?”

“గర్జించి తీరాలా?” అమ్మాయి అడిగింది.

“అవును,” అంది సింహం.

“అయితే గర్జించవచ్చు అనుకుంటా,” అంది చిన్న అమ్మాయి.

“రెండవ షరతు ఏమిటి?” సింహం అడిగింది.

“నన్ను నీ వీపు మీద కూర్చోపెట్టుకుని బడికి తీసుకుని వెళ్లాలి.”

“సరే,” అంది సింహం.

సింహం కూర్చోగానే చిన్న అమ్మాయి దాని వీపు మీదకి ఎక్కింది. ఆ తరవాత ఇద్దరూ బడికి వెళ్లారు. సింహం పైన సవారీ చేసిన చిన్న అమ్మాయి ఆమె ఒక్కతే అయి ఉంటుంది.

వీపు మీద చిన్న అమ్మాయితో బడి వైపుకి సింహం పరుగు తీసింది. అయినప్పటికీ వాళ్లు వెళ్లేసరికి ఆలస్యం అయిపోయింది. సింహం, చిన్న అమ్మాయి తరగతి గదిలోకి ప్రవేశించే సరకి టీచరు హాజరు తీసుకుంటున్నారు.

చిన్న అమ్మాయి, సింహాన్ని చూసిన టీచరు హాజరు తీసుకోవటం ఆపేశారు. సింహం వైపు ఆమె గుడ్లప్పగించి చూస్తుండిపోయారు. మిగిలిన పిల్లలు కూడా సింహాన్ని అలాగే చూస్తున్నారు. "బడికి పెంపుడు జంతువులను తీసుకుని రాకూడదని నీకు తెలుసుగా?" అని టీచరు అడిగారు.

సింహం తన తోకను గట్టిగా ఊపసాగింది. “ఈ సింహం పెంపుడు జంతువు కాదు. ఇది నా స్నేహితురాలు, నాతో పాటు బడికి వచ్చింది,” అని చిన్న అమ్మాయి జవాబు చెప్పింది.

సింహం వైపు గుడ్లప్పగించి చూస్తూనే, “దాని పేరు ఏమిటి?” అని టీచరు అడిగారు.

“హంసిం,” చిన్న అమ్మాయి బదులు ఇచ్చింది. “దీని పేరు హంసిం, అంతే.”

తన స్నేహితురాలి పేరు సింహం అని టీచరుకి చెపితే బాగుండదని చిన్న అమ్మాయి దానిని తిరగేసి హంసిం అని చెప్పింది.

హాజరు పుస్తకంలో టీచరు ఆ పేరు రాసింది: హంసిం.

తరవాత హాజరు తీసుకోవటం మళ్లీ మొదలుపెట్టారు.

“బుల్లి బేబీ,” టీచరు హాజరు పిలిచారు.

“వచ్చాను, టీచర్,” చిన్న అమ్మాయి పలికింది.

“హంసిం,” టీచరు పిలిచారు.

“ఆఁ,” సింహం పలికింది. తన పదునైన కోర పళ్లు చూపించటానికి అది సాధ్యమైనంత పెద్దగా తన నోరు తెరిచింది. తరవాత అది చిన్న అమ్మాయి పక్కన కూర్చుంది.

అది అచ్చం ఒక పెద్ద పిల్లి లాగా కూర్చుంది. దాని తోకను ముందు కాళ్ల మీదకు వేసుకుంది.

టీచరు ఏమీ అనకపోయేసరికి సింహం కూడా మాట్లాడకుండా కూర్చుంది. అది గుర్రుమని అన లేదు, గర్జించ లేదు. ఆటల సమయంలో సింహం, చిన్న అమ్మాయి మైదానంలోకి వెళ్లారు.

సింహాన్ని చూడటానికి పిల్లలందరూ గుమిగూడారు. తరవాత కొంత సేపటికి తిరిగి ఆటలు ఆడుకోసాగారు. మైదానంలో ఒక పక్కగా చిన్న అమ్మాయి నిలబడి ఉంది, ఆమె పక్కనే సింహం ఉంది.

“మిగిలిన వాళ్లలాగా మనం ఎందుకు ఆడటం లేదు?” సింహం అడిగింది.

“ఇతర పిల్లలు నన్ను ఇబ్బంది పెడతారు. ఏ కారణం లేకుండా నన్ను కొడతారు,” చిన్న అమ్మాయి చెప్పింది.

“నేను వాళ్లని సరి చేస్తాను,” అంటూ సింహం గుర్రుమంది.

“ఒక పెద్ద పిల్లవాడు ఉన్నాడు – చాలా పెద్దవాడు,” చిన్న అమ్మాయి చెప్పింది. “వాడి పేరు బాబి బారోడు. ఏ కారణం లేకుండా నన్ను తోస్తాడు.”

“అతడు ఎక్కడ ఉన్నాడో నాకు చూపించు,” అంది సింహం.

బాబీ బారోడుని చిన్న అమ్మాయి చూపించింది.
"సరే, అతని సంగతి చూస్తాను!" అంది సింహం.
కొంతసేపటికి గంట మోగటంతో అందరూ తమ తమ తరగతి గదులలోకి వెళ్లిపోయారు. చిన్న అమ్మాయి తోపాటు సింహం తరగతిలోకి వెళ్లి ఆమె పక్కనే కూర్చుంది. అన్నం బెల్లు అయ్యేవరకు పిల్లలు రాస్తూనే ఉన్నారు.
సింహానికి ఆకలిగా ఉంది. తాను తినబోయే దాని బొమ్మ వెయ్యాలని అనుకుంది.
"మధ్యాహ్నం భోజనంలో ఏం పెడతారు?" చిన్న అమ్మాయిని అడిగింది సింహం. "నాకు మాంసం పెడతారేమోనని ఆశగా ఉంది."
"లేదు," చిన్న అమ్మాయి చెప్పింది. "ఇవాళ శుక్రవారం, కాబట్టి చేపల కూర పెడతారు."

పసుపు పచ్చ క్రేయాన్ ఇచ్చి చేప బొమ్మ వెయ్యటం సింహానికి నేర్పించింది చిన్న అమ్మాయి. బొమ్మ కింద, “నాకు చేపల కంటే మాంసం ఇష్టం,” అని సింహం రాసింది.

మధ్యాహ్న భోజన సమయం అయ్యింది. భోజనాల బల్ల దగ్గర చిన్న అమ్మాయి పక్కన ఒక కుర్చీలో సింహం కూర్చుంది.

సింహం తొందర తొందరగా తినేసింది: “నాకు ఇంకా ఆకలిగానే ఉంది. తినటానికి మాంసం ఉంటే బాగుండునని ఉంది.”

భోజనాల తరవాత పిల్లలు అందరూ ఆటల మైదానంలోకి వెళ్లారు.

పెద్ద పిల్లలందరూ పరిగెడుతున్నారు. అందరిలోకి పెద్దవాడైన బాబీ బారోడు చిన్న అమ్మాయి వైపుకి పరిగెత్తుకుంటూ వస్తున్నాడు. ఆమె చుట్టూ గుండ్రంగా తిరుగుతూ మెల్లగా దగ్గరకు వస్తున్నాడు.

“నా స్నేహితురాలికి తగులుకుంటావు, ఇక్కడినుంచి వెళ్లిపో,” అంది సింహం.

“నేను వెళ్లను,” బాబీ బారోడు అన్నాడు.

సింహం వెనక చిన్న అమ్మాయి దాక్కుంది. బాబీ బారోడు ఇంకా ఇంకా దగ్గరకి వస్తున్నాడు. అప్పుడు సింహం గుర్రుమంటూ నోరు తెరిచింది. కత్తులలాగా పదునుగా ఉన్న సింహం కోర పళ్లను బాబీ బారోడు చూశాడు. అతడు పరిగెత్తటం ఆపి గుడ్లప్పగించి చూడసాగాడు.

సింహం తన నోటిని పెద్దగా తెరిచింది. చీకటి గుహలాంటి దాని గొంతు బాబీ బారోడికి కనిపించింది. దాంతో అతడి ముఖం తెల్లగా పాలిపోయింది.

అప్పుడు సింహం పెద్దగా గర్జించింది.

సింహం అలా చాలాసేపు గర్జించింది.
ఆ గర్జన విని బడిలోని టీచర్లందరూ బయటకు వచ్చారు. పిల్లలందరూ ఆటలు ఆపేసి వేళ్లతో చెవులు మూసేసుకున్నారు. అందరి కంటే బలవంతుడనని విర్ర వీగే బాబీ బారోడు అక్కడినుంచి ఇంటివైపుకి పరుగుతీశాడు. ఇంటికి చేరుకున్న తరవాత గానీ అతడు పరుగు ఆపలేదు.
అప్పుడు చిన్న అమ్మాయి సింహం వెనక నుంచి బయటకు వచ్చింది.
"ఇక అతడి గురించి ఆలోచించాల్సిన పని లేదు. అతడికి భయపడాల్సిన పని లేదు," అంది సింహం.
"నాకు ఆకలిగా ఉంది. ఆ పిల్లవాడిని గుటుక్కుమనిపించి ఉందును. కానీ నీకు ఇచ్చిన మాట గుర్తుకు వచ్చింది," అంది సింహం.
"వాళ్ల అమ్మ ఏమాత్రం సంతోషించేది కాదు," అంది చిన్న అమ్మాయి.

“భోజనం తరవాత తరగతికి వెళ్లే సమయం అయ్యింది.”

“నేను ఇప్పుడు తరగతిలోకి రావటం లేదు,” చెప్పింది సింహం.

“సరే, సోమవారం మళ్లీ కలుద్దాం,” అంది చిన్న అమ్మాయి.

కానీ దానికి సింహం ఏమీ బదులు ఇవ్వలేదు. అది అక్కడినుంచి వెళ్లిపోయింది.

సోమవారం నాడు సింహం బడికి రాలేదు. ఆటల సమయంలో అందరికంటే పెద్ద పిల్లవాడు చిన్న అమ్మాయి దగ్గరకు వచ్చాడు.

“పెద్దగా గర్జించే నీ స్నేహితురాలు ఏది?” అని అతను అడిగాడు.

“ఈ రోజు రాలేదు,” చెప్పింది చిన్న అమ్మాయి.

“మళ్లీ వస్తుందా?” బాబీ బారోడు అడిగాడు.

“రావొచ్చు,” చిన్న అమ్మాయి బదులు ఇచ్చింది. “నువ్వు జాగ్రత్తగా ఉండాలి.”

**అయిపోయింది**